# రాష్ట్రీయ వార్తలు

## డాకూరు

శ్రీయుత కోకా రంగారావు కంట్రాక్టరుగారి యౌదార్యము.

(ఒక గ్రంథాలయాభిమాని)

౯—౧౦—౪౭

శ్రీ సచ్చిదానందాంధ్ర గ్రంథనిలయము నిచట ౧౩౩౯ ఫస్లీయందు స్థాపించినవారు కీర్తిశేషులగు గుండేరావు దేశపాండ్యగారు వీరు రెండుసంవత్సరములవరకు కత్యంతశ్రమ గావించి సుమారు (౩) వందల గ్రంథములు ప్రోగుచేసి వివిధ పత్రికలు తెప్పించి ప్రఖ్యాతి గడించి తమ ప్రత్యేక మందిరమున గ్రంథనిలయమును కొంతకాలము నడిపిరి "శ్రీసంతులుగారు యకాలమృత్యువునకు గుఱియైరి. శ్రీయుత ఆరేటి నారాయణరెడ్డి సమస్త పట్వారిగారు శ్రద్ధవహించి గ్రంథనిలయమునకు మిగుల పాటుపడి నేటివరకు (౫) వందల గ్రంథముల సమకూర్చిరి చందాదారులు చందా లివ్వని కారణమున స్వయముగ నమూల్యగ్రంథముల తెప్పించి భాషాసేవకు గృషిసలిపిరి పరాధీనమునందున్న గ్రంథనిలయమునకు తమస్వంతస్థలమున మందిర నిర్మాణమునకు చందాలమూలమున ప్రయత్నింప నమకట్టిరి అంతవీరి ప్రయత్నము నెరిగిన బెజవాడ కాంట్రక్టరులును, (౧౦) సంవత్సరముల నుండి యిచట కంట్రాక్టుపనుల గావించి ప్రస్తుతము విరమించిన శ్రీయుత కోకా వెంకటరంగారావుగారు వారిధర్మపత్నియగు శ్రీమతిలక్ష్మిబాయమ్మగారు గ్రంథనిలయస్థలమునందే ఆలయనిర్మాణమునకు పూనుకొని గ్రంథాలయమునకనుబంధముగా శ్రీకృష్ణ హరినాధ బాబా భజన మండలిని స్థాపించిరి గ్రంథాలయనిర్మాణకార్యము పూర్తిఅయినది. గ్రంథనిలయమున కిరుపార్శ్వములయందు పశ్చిమ భాగమునందొక మడిగెను కట్టించి దానిపైనదివ్వె అద్దెతో దీపారాధనవ్యయము నేర్పరిచిరి ప్రాగ్భాగమున దొక గదినిర్మించి యందు ప్రయాణికులు పాంథులు నిలచుటకు, బసచేయుటకును అన్నదానము చేయునపుడు పాకశాలగా వినియోగింప సంకల్పించిరి. నిర్మాణకార్యము వర్షాకాలమువలన నిలచియున్నది, గ్రంథనిలయ ప్రవేశోత్సవము అతి వైభవముగా జరిపిరి మరియు దీనులకు అనాధులకు అన్నదానముగా విరిచిరి ప్రతిసోమ శుక్ర వారములయందు శ్రీకుసుమ హరినాధ భజన (౮) మొదలు (౧౦) వరకు మహానందముగ జరుగునట్లేర్పాటుగావించియున్నారు "నిత్యముగా-జరుగుచున్నది గ్రంథనిలయమునకు కొన్ని గ్రంథముల నొసగి ఆంధ్ర వారపత్రికను శాశ్వతముగా తెప్పించి యొసగుటకు వాగ్దానమొసగిరి. గ్రంథనిలయమునకు శ్రీయుతులు మాదరెడ్డిగారి బుచ్చిరెడ్డిగారు, పతంగి కిషనుగారు, గ్రంథపా

## ఏనుకూరు

(ఒక విలేఖరి)

౨౫—౧౧—౪౭ ఫసలి,

మధిర తాలూకాలో చేరిన యీ గ్రామమునందు యింటాడిపాఠశాలగలదు. రామరాజాగారు ౪౫ ఫసలి నుండి పిల్లలకు విద్య గరపుచున్నారు. ప్రతిదినము పాఠశాలకు ౨౫—౩౦ మంది బాలురు వచ్చుచుందురు నాజరుసాII గారు కూడా యీ పాఠశాలను పరిశీలించి పై యధికారులకు రిపోర్టుచేసిరి ఈ పాఠశాలకు విద్యాశాఖనుండి నెల ౧ కి రు ౩ మాత్రమున వాయిదాయొసంగబడుచున్నది పైన తెల్పిన తేదీనుండి నేటివరకు ఉపాధ్యాయులవారికి ఒక నెలజీతము రు ౩ మాత్రము యివ్వబడెను మిగతజీతమునకై ప్రయత్నముజరుగుచున్నది.

రామరాజుగారు వుదారస్వభావులు విద్యార్థి మానసులు, దయార్ద్ర హృదయులు, పలు విఘ్నములు కష్టనష్టములకోర్చి ఏకదీక్షతో కర్తవ్యము సాగించుచున్నారు యీ గ్రామ మరణ్యమధ్యమున క్రూరమృగముల నివాసస్థానముగా నుండుటచేత, మలేరియా రోగమునకు పుట్టిల్లు

ఇట్టిస్వల్పజీతమునైన పాఠశాలను నిర్వహించుచున్న యుపాధ్యాయుల మొరాలకించు యధికారులు కానరారైరి ,ఘనII నిII ప్రభువు (౩౦) లక్ష రూప్యములు విద్యాశాఖకై వెచ్చించుచుండుట లోకవిదితము. దీనికి గుడ్డకుల, దూరలగు కర్షకబాలుర విద్యానిమిత్తమై మాయూర నిర్మింపబడిన పాఠశాలకు రు ౩ మాత్రము, రైతులనుండి పనులు చేయులోక లుపండులోనుంచి. తకణమున నెలనెలకు పొందుటకు నోచుకొనకుండుట వీరి దురదృష్టము ఇంతకును న్యాయమహాజర్లు,దరఖాస్తులు, ముఖ్యసదాకకు పాములు మున్నగునవి పంపుకొను కార్యాలాపముగి ననులాభములేక పోయెను ఈ విషయమున యెహైనియాం గారు ఆలోచించు టత్యవసరము.

ఇదికాలాకాలో అన్నవరములింగన్నపేట యను రెండు గ్రామములందు ఏనుకూరు సమీపమున నున్నది, దియూర్లకు వాళాను లోకలుఫండుమట్టి గ్రాంటు పాఠశాలలు స్థాపింపబడుట ముఖ్యము

అకులుగా పని చేయుచున్నారు ప్రాత చందాదారులను తొలగించి క్రొత్త చందాదారులను (౧౫) గురు కూర్చినారు చందాధనము క్రమముగా ప్రోగుచేయు ప్రయత్నము సాగుచున్నది శ్రీయుత రంగారావుగారు కీర్తికార్యమును నెరవేర్చి ధన్యజీవులైరి

## చిత్తలూరు

వర్షాభావముచే కర్షకుల యిక్కట్లు

(ఒక విలేఖరి)

౧౩ అబాన్

నల్లగొండజిల్లాలో చేరిన గ్రామములలో నిదియొకటి ఇచట తో లకరినుండి సస్యానుకూలముగు వర్షములు లేవు. అపుడపుడు రాలినకుపారములకు ప్రవాసవిత్తనములు జేసినారు. మొలచినవి, మొలచినవి నిలిచినవి తమయొద్ద లేకున్న వేరుసెనగ పుట్లకుపుట్లు వరినాగుల కొరకు రొద్దతెచ్చి పాపము రైతులు తమఋణము చెల్లించి ఆర్థికమస్థితినుండి విముక్తియగుటకు పశువులచేత కైన చోర్పనాసించక అసువ్యయములకోర్చి పలుకులలో లిపించి భూమపై పెడజల్లినారు. నాగు లెటు ముడిచడు నాయని ఆందోళనమనస్కులైనారు కంచెలలో గడ్డి సున్న. చేతిమేతలయిపోయినవి' వరిపంటలు' ఇచట భావులుగాని చెరువుగాని లేవు మాసావదినుండి మాడు కాలవ లేర్పడి యున్నవనేకాని యెటులైతే కృష్ణ, గోదావరి, పెన్న, కావేరి, తుంగభద్ర మొదలయినవదులకు ప్రభుత్వమువారానకట్టలు వైచి నీరు నిలువరియించి ఉపయోగించుకొనునట్లాచరించుటచే ఎల్లప్పుడు నిర్విచారముగా మాతృస్తన్యపానముచే పెరిగిన శిశువులవలె పైరులనుకూలముగానున్నవని వినుచున్నాము. మాదురదృష్ట మట్టి యానకట్టలకు, నాకార్యములకు భాజనము కాలేదు .సేలము మనుష్యులు చేసెక్కలతో, పారలతో నేవ్యభూములను పారింపకొనుటకు యినుకలో సుమారై దారు మైళ్లవరకు రాత్రి పగళ్లనక తోడి పాటుపడి కష్టముచే జనించిన ఘర్మబిందువులతో మిశ్రితమొనర్చి జాలు గలిగించి నడుపుచుండ ఇంతదూరమువచ్చు జలమును నడుమ పిపాసాతురతచే పశు పక్షి మృగాదులు పానమొనరించి మిగిలినదిపచే జాట్లుపెట్టినారు. తగినంత నీరులేక నిలచియున్న పైరులనుచూచి నిట్టూర్పులతో , నిలువుగుడ్లతో, దీనముఖులై కల్లాడుచున్నారు తేరేయాధారము గాంచలేరక యున్నారు. ప్రభుత్వమువారు మాసావదిక్కడ్డముగా గండిపేట చెర్వువేసినప్పటినుండి నదిలో పారు క్రమముగా రావడంలేదు ఇటువంటి కరవుదినములలో ప్రభుత్వమువారు చెరువునందలి యొకతలుపు వొక్క-కోట అరుగంటలకొరకు తెరువనాజ్ఞాపించిన మూసీలోకి నీరు వచ్చును జలలు వృద్ధియగును కృషికుల శరీర కష్టములకు ఫలోదయము కలుగును వరిపైరుల మట్టుకైన ఆధారముకలుగునని ఆశయము, ఇచట భారాలుకూడ చెరువులక్రిందమాదిరి యు ౧ కు తుదకు రు ౧ ౧ రూపాయలవరకు విధించినారు. కృషికులకష్టమునవలోకించిన వరి పైరులయినా అక్కరకువచ్చును, మా గికి ఆధారమేకనపించదు మరుమటేపనివలె ఎండలు మెండుగానున్నవి కిష్టులు పనిపించినవి, ఋణదాతలు కాలమునగని అప్పులు పుట్టనిచ్చుటలేదు ఈశ్వరసంవత్సరము పదిరెండువిసములపంటయును పంచాంగములలోని సిద్ధాంతములు తెల్లక్రిందులయినవి నాటికు వీనిమలై నా నైనదో మొర్రిడ తేలునో తేలదో! రైతులదుస్థితి ప్రభుత్వమువారికెకరముపై నాధారపడియున్నదని. గమనించుదురుగాక యని నమ్ముచున్నాము

---

# 125000

## వ్యక్తులు

హిందూస్థాన్ కోఆపరేటివ్ యిన్సూరెన్సు సొసైటి లిమిటెడ్ లో తమ జీవితముల భీమా చేసియున్నారు.

**మీరుకూడ దానినే నిర్ణయించుకొనుడు**

స్థానిక కార్యాలయము.—సెంట్రల్ బ్యాంకుబిల్డింగు, మాహెరాజ ఉస్మాని హైదరాబాదు-దక్కన్.

---

డోంగ్రే గారి

బాలామృతము

బలహీనమైన

బిడ్డలకు

పుష్టియును,

బలమును,

ఆరోగ్యము

నిచ్చును.

---

ఒక సారిమా దుకాణమునకు వచ్చి పరీక్షింపుడు

PATANGAY BROS
HYDERABAD DN

నోటు — ఉత్తర ప్రత్యుత్తరములకు జవాబుకార్డు లేక ఒక అణా టికటు పంపవలెనని

## హైద్రాబాదులో బొంబాయిమాదిరి కుట్టిన-బట్టలు

మాదుకాణములో వివిధమైన కోట్లు పట్లోనులు, కమీజులు, సైలర్ సూటు, షేర్వానీలు, ఖాకీషార్టు మర్సు నిక్కర్, ఖాకీకోట్, పట్లోను లాగులు, ఆఫ్ షరంలు, బనియనులు, పిల్లల రేష్మీ, మఖ్మల్ ఫ్రాగులు, జాకీట్లు, మొదలగు దుస్తులు, సరసమయిన ధరలకు అమ్మబడును. ఒకసారి ఖరీదుచేసి పరీక్షించుడు.

ప్రధాన కార్యాలయము —

**పతంగిబ్రదర్స్, సాలార్ జంగ్ బిల్డింగ్**

బ్రాంచి — హైదరాబాదు-దక్కన్.

గవర్న మెంటు బిల్డింగు నం ౨౧ పురాన జైలుబజారు

సికిందరాబాదు.

---

మీ ఆప్త మిత్రులు

# ది సన్ లైఫ్

## ఆఫ్ ఇండియా యిన్సూరెన్సు కంపెనీ లిమిటెడ్

హెడ్. ఆ. 3 టెంపుల్ రోడ్, లాహోర్

(స్థాపితము 1932)

అధ్యక్షుడు — గౌII ఆర్.బి.యల్. రాంశరణ్ దాసు సి. ఐ. యి., యం. సి. యస్.,

మేనేజింగ్ డైరెక్టరు — భీంసేన్ సచార్ బి. ఎ. యల్ యల్. బి- యం. యల్ ఎ,

పుట్టి కొలదిసంవత్సరములేయైనను నమ్మకమైన రక్షణ

ఆదర్శపూర్ణమైన ఉపకారము

**తక్కువ కిస్తులతో బాటు ఎక్కువ బోనసు**

ఒసగుచున్నది.

క్వెట్టా భూకంపములో మరణముల క్లెయిములమీద

**దాదాపు ర్పు 50,000 లు చెల్లించబడినవి.**

ప్రొ. ఫెవర్ కె. బి. మాధవ M. A., F. R. A. S., A. I. A., (లండన్) గారుయిట్లు వ్రాయుచున్నారు.

- లెక్కలు సక్రమము.
- వ్యాపారము., మేనేజిమెంటు, ప్రశంసార్హము.
- మరణముల సంఖ్య స్వల్పము.
- వడ్డీ ఆదాయము అధికము.
- వ్యయము స్వల్పము.

**పూర్తిచేయబడిన వ్యాపారము సుమారు 1,50,00,000**

ఉదారమైన పద్ధతులపైన ఆర్గనైజర్లు, ఏజంట్లుకావలెను. పనిచేయువారలకు సర్వవిధముల తోడ్పాటుచేయబడును దరఖాస్తులు పంపు టకు —

చంద్రాఅండుకో, చీఫ్ ఆర్గనైజర్లు, మదరాసు రాజధాని, దేశీయ సంస్థానములు 164, కైలాస్ మాన్షన్సు, మారేడ్ పల్లి, సికింద్రాబాదు.

లేక

పొలిసెట్టి లక్ష్మయ్య, స్పెషల్ ఆర్గనైజరు నిజాంరాష్ట్రమునకు

---

కొందరు మాత్రమే ప్రమోషను [illegible]

## ఎల్లప్పుడు అలసట నీకు జయము చేకూర్పదు

అలసటగా యున్నయెడల నీయావచ్ఛక్తిని వినియోగపరుపలేవు. వలనన నీవు ఖర్చుపెట్టుశక్తిని మరల కూర్చుకొనలేక పోవుటయే- ఉదయముననే నిద్రలేచినప్పుడు నిస్సత్తువగా నున్నయెడల రాత్రి పరుండబోవునప్పుడు ఒక గిన్నెడు హార్లిక్సును పుచ్చుకొనుము. అది నీశక్తిని త్వరతో సమకూర్చి నీశక్తిని పెంపొందించును.

హార్లిక్సులో, అవుపాలతోను మీగడ, బార్లి, గోధుమలో యున్న బలకర పదార్థములున్నయీనున్నవి. గంజిపదార్థము లేదు

హార్లిక్స్ [illegible]

# రైతులకు లక్ష రూపాయిల శిస్తుల మాఫీ

అజ్ఞానము, అవిద్యను నిర్మూలింపజేయుటకు సరిహద్దురాష్ట్రపు కాంగ్రెసు మంత్రివర్గమువారి స్థిరసంకల్పము.

## ఆదాయ వ్యయ పట్టిక వివరము

అబోటాబాదు ౧౫ సెప్టెంబరు.

కాంగ్రెసుమంత్రివర్గమునం దార్థికమంత్రి అగు భంజారాం గాంధిగారు నిన్న శాసనసభయందు ఆదాయవ్యయపట్టికను ప్రవేశపెట్టిరి.

"౭ సెప్టెంబరునుండి జనప్రభుత్వమేర్పడినది. ఈ అత్యల్పవ్యవధిలో నేము శిస్తులయందు సంభావ్యత గాగల లక్షరూప్యములు మాఫీ చేయుటయు ఇరువదివేల రూప్యములను ప్రయాణపు ఖర్చులనుండి మిగిలించగలిగితిమి" అని ఆర్థికమంత్రులు వివరపరచిరి.

ప్రజల దారిద్ర్యస్థితి ననుసరించి మంత్రుల అధ్యక్షుల జీతములు, అలవెన్సులు తగ్గించుట కాలోచింపబడుచున్నవి ఇటుల మొత్తము ౨౦వేలరూప్యలు తగ్గింపబడును.

భూమ్యాదాయమునందు నిలువ కిలుగుట వలన అప్పోటాబాదు లక్షరూప్యముల శిస్తు యందు, మాఫీ ఒసగబడినది. ౫౦,౦౦౦ రూప్యములు త్రాగు నీటి స్కీములకు నిర్ణయింపబడినది. పార్లమెంటరీ కార్యదర్శుల విషయములో రు. ౫,౦౦౦లు హెచ్చింపబడినవి. వీరి జీతపు మొత్తము రూ౧౦౦౦ల నిల్వ యేర్పడగలదు.

ప్రభుత్వమునకు ఆదాయము ఈ సారి ౧౫౪ లక్షలు, వ్యయము ౧౫౩౨ లక్షలు ఉండగలదని అంచనా వేయబడినది. గత సంవత్సరపు రెండవసారి అంచనాప్రకారము ఆదాయము రూ ౧౫౭ లక్షల ౫౯ వేలు, వ్యయము రూ ౧౫౦ లక్షల ౧౫ వేలు. లోటు రూ ౪ లక్షల ౭౨ వేలు. నిలువ రూ ౩ లక్షల ౬౧ నుండి బర్తీచేయబడినది.

రెండవఅంచనాలో ఆదాయముకంటె వ్యయము రూ ౧౫ లక్షల ౨౦ వేలు ఎక్కువయగుటకు ముఖ్యకారణము నిర్మాణములకై చేయబడిన ఖర్చు రూ ౧౦ లక్షల ౨౫ వేలు హెచ్చినది. ఈనిర్మాణములో చాల ముఖ్యమైనది అసెంబ్లీ భవననిర్మాణమునకై ప్రభుత్వమువారు ఖర్చుపెట్టిన రూ ౨ లక్షల వేలు. తక్కిన ౫ లక్షలను రాష్ట్రమునకు స్వాతంత్ర్యము నమలుపరచుటకును, కార్యనిర్వాహక శాఖనుండి న్యాయ పరిపాలనశాఖ వేరు చేయుటకును అగు ఖర్చు.

పెట్టుబడిక్రిందను ఋణముక్రిందను ఆదాయము రూ ౧౩౩ లక్షల ౭౪ వేలనియు, వ్యయము రూ ౧౪౫ లక్షల ౧౩ వేలనియు అంచనా వేయబడినది. ఇందు మొదటిదగు ఆదాయము కేంద్రప్రభుత్వమునకు చెల్లించవలసిన ౩౫ లక్షలను, మలకండు హైడ్రో యలెక్ట్రిక్ పనులకును, ఇతర నిర్మాణములకును చేయబడిన ఖర్చులకై తీసికొనబడిన ఋణమును తీర్చుటకై క్రొత్తగా చేయబడిన ఋణమైయున్నది.

భావివిధానమునుగూర్చి ఆర్థికమంత్రి ఇట్లు చెప్పెను. "ప్రాథమిక పాఠశాలలను మసీదులలోను, దేవాలయములందును, ధర్మశాలలలోను నిర్వహింపజేయుటకు యత్నించి అవిద్యను తొలగించదలచినాము. నిరుద్యోగమును తొలగించి రాష్ట్రములో పరిశ్రమల నుజ్జీవింపజేయదలచితిమి."

ప్రకటనశాఖను రద్దుచేసి, రెండు వార్తాపత్రికలకు ఇచ్చిన తక్కువదీనిని కొనసాగనట్లు చేయుటకు ప్రభుత్వమువారు నిశ్చయించిరి. పోలీసులకగు ఖర్చులలోను, ప్రత్యేక జీతములలోను తగ్గింపుచేయగలమని ఆర్థికమంత్రి సూచించెను. వ్యవసాయకుల ఋణభారమునుగూర్చిన విచారణయు కొన్ని శాఖలలో వృథాఖర్చుల పరిశీలనయు జరుగగలదని వారు సూచించిరి.

అబ్కారీనిగురించి వారిట్లు చెప్పిరి: "అప్పుడే సుక్తారీయబడియుండుటచే, ఇప్పుడు మేమేమియు చేయజాలము. కాని మద్యమునెక్కు దినుసులను తగ్గించి, అవశ్యమును ఇ.... మార్గమున భర్తీచేయగలము.

వినోదములపై పన్నువిషయము త్వరలో శాసనసభవారి ఆలోచనకు తేబడునదియు, అనవులు ముఖ్యమైన పన్ను ఆధారములుగా ఉపయోగించునేమో ఆలోచింపబడునదియు భారీ విద్యాసంస్థలు ప్రజలు భరించలేని జీతములిచ్చు ఉపాధ్యాయులను నియోగించరాదని ఆర్థికమంత్రి ప్రజలకు విన్నపము చేసెను.

## మతపరివర్తనము

(ఒక ప్రేక్షకుడు)

సూర్యాపేట తాలూకాయందు సుమారు నాలుగు నెలలకు పూర్వము మహమ్మదీయ మత ప్రచారము తీవ్రముగా జరిగి కొన్నిగ్రామములలోని హరిజనులు మునల్మానులయిరి. మతప్రచారకుల బోధనలు దౌర్జన్య మగుటంజేసి మనస్పర్ధలకు తావిచ్చుచున్నవి. ఇట్టి ప్రబోధములు ఎంత సమంజసమైనవో చదువరులు యూహింతురు గాక. ఈ తాలూకాయందు మహమ్మదీయ మత మవలంభించిన గ్రామము లందలి విషయములు.

### దేవరుప్పల

ఇచ్చట సుమారు ౪౦౦ మంది హరిజనులు మహమ్మదీయు లయినారు. యీ గ్రామమున హిరలు అనగా సామస్లిలు బ్రాహ్మణులు మొదలుగాగల యిండ్లలోకి ఏల రాకూడదనియు మాదుకలు మాలోకలని తిరుగుట లేదా? అని గోల చేయుచున్నారు. ఇంకను చెప్పరాని దుర్భాష లాడుచున్నారు.

### కడవెండి

ఇచ్చట సుమారు ౩౦౦మంది హరిజనులు ముసల్మానుమతము స్వీకరించి తిరిగి తిండి దొరకని కారణమున ౧౦౦మంది హిందు మతము నవలంభించినారు. మిగత వారలు శక్తిలేనందువలన తక్కువ జాతివారమైన హిందువుల బెదరించుచు పొట్ట గడుపుకొనుచున్నారు.

### రామన్నగూడెం

ఇచ్చట సుమారు ౨౦౦ మంది హరిజనులు ముసల్మాను అయినారు. అందులో ౧౦౦ మంది తిరిగి హిందూమతము స్వీకరించిరి.

### రామవరం

ఈ గ్రామమున సుమారు ౪౦౦ మంది ముసల్మానులయినారు. ఆగ్రామమందలి పెద్ద వ్యవసాయదారులగు శ్రీ కొనారు రామచంద్రరావు

గారికి తీవ్రమైన కష్టము కలుగ జేయుచున్నందుకు గాక వారిమీద మున్సఫీలో దావాలుకూడ చేసియున్నారు. ఆ గ్రామమందలి కదిరి రైతులు కూడ పడరాని పాట్లు పడుచున్నారు. యీ మధ్య సుమారు రెండుక్రిందట చాల అలజడి ప్రబలి శ్రీ రామచంద్రరావుగారు పోలీసు మొహతెమీం గారికి మా సబిన్స్పెక్టరు గారికి అన్ని విషయములు తెల్పుకొనగా శ్రీవారు ఒక నెల నుండి పోలీసు కానిస్టబిల్ను రక్షణ కుంచినారు.

### కొడుకండ్ల

ఇచ్చట సుమారు ౪౦౦ మంది మహమ్మదీయులయిరి. యీ గ్రామములో ౫౧ యిండ్లవారు మహమ్మదీయులు కలరు. వీరు ఏకమై హిందువులను చాల కష్టపెట్టుటయేకాక వారిపైన పోలీసుకేసు కూడా పెట్టించిరి. అన్యాయముని అధికారులకు తెలుపుకొనిరి. ఇంతవరకు చాలినన్ని లేదు. గ్రామములో దరు ముసల్మానులను కొత్తగా చేర్చుకొని వారు పట్టుదలతో వాయనియు నిద్రాహారములు మాని భగవంతుని ప్రార్థించుచున్నారు. యిది అంతయు స్థానిక మహమ్మదీయుల ప్రోత్సాహము జరిగినది!

### నర్సింగాపురం

ఇచ్చట సుమారు ౧౦౦ మంది మహమ్మదీయులైరి. అందులో నల్గురు తిరిగి హిందూమత మవలంబించిరి. తక్కిన తిరిగి నిశ్చయించుకొన చేయ్యగా వారు మాయిష్టము చేయు హిందూ మతమందే వుండుమనగా కొంత దౌర్జన్యము చేసినట్లు హిందూ మత మవలంబించిన వారు మొరపెట్టుకొనుచున్నారు.

### యేడునూతుల

ఈగ్రామమందు ౨౦౦మంది మహమ్మదీయులయిరి. వారి పనిపాటలు వారు చేసుకొనుచున్నారు.

### మొండ్రాయి

ఇచ్చట సుమారు ౩౦౦ మంది మహమ్మదీయులైరి. అందరు హిందూమతముపరిగా చేరిరి. ఈ ప్రాంతమునందు చాల పంచమలు గలుగుచున్నది. దీని నివర్తించుటకు ప్రభుత్వమువారు వెంటనే బూనుకొనకున్న హిందువులు చాల కష్టము అనుభవించుటయే కాక వారి వ్యవసాయములకూడ మట్టిపాలగును. కొన్నికొన్ని గ్రామములలో చేనులు మేపుకొనుట పంటలను చేలమీదనే దొంగలించుట మొదలగు అక్రమములు జరుగుచున్న

ది. చేను మేపుచుండగా పశువులను బందెదొడ్డిలో తోలగ యిరువదిమంది కలసి వచ్చి దొడ్డిలోని పశువులను కొట్టుకొనిపోవ కొడుకండ్ల పోలీసుపటేలుగారు స్టేషను హౌసుకు రిపోర్టు చేసినను తగుచర్య తీసికొనకయే విడిచిపెట్టినట్లు కొలవిరి. ఇట్టి తెలియుచున్నది. దీనికై హైనాకిహాన గ్రామములు అర్జీలు పంపిరి. కాని యింతవరకు యేమియు జరుగలేదు. అందరు భగవంతునిపై భారము వేసియున్నారు.

౪వ పేజీ ౬వ కాలం తరువాయి

రయిలు చెప్పబడలేదు. కాని నేను సూచన చేయదల్చునేమి, వారలు ౧౯౩౫ హిందూ ఫర్మాను ననుసరించి వాలు గొరెండ్లు కష్టపడి తయారుచేసిన రికార్డులవన్నిటిని ముందు పెదికి మటకంటె ఎక్కువచేయజాలరు. ఈ రికార్డుల సమూచిన, ఈసమస్య త్రిప్పించి మర్లించి పరిశీలన చేయుటకి, అంతయు సిద్ధము చేయబడియుంచబడినట్లు తెలియగలదు. సర్ అక్బర్ గారు తమ కార్యక్రమమును చురుకుగా నిర్వర్తించుచున్నారు కాబట్టి, పైసూచన అమలింపబడినచో, కమిటీపని సాధ్యమైనంతత్వరలో ముగియగలదు. మరియు, నివేదిక సిద్ధమైనతర్వాత, అది ప్రజలకు అంగీకార యోగ్యముగనుండవలెనన్న, ప్రభుత్వమువారు తుదితీర్మానము చేసికొను లోపల ప్రజలు చేయదలచిన విమర్శలకై దానిని ప్రకటించవలెను.

నియంతృత్వము వ్యాపించుచుండుటవలన ప్రజలే ప్రభువులను సిద్ధాంతమునకు అనుగుణమునైన నీతులకన్నిటికి డిబ్బరగులుచున్న నీరోజులలో, ప్రెసిడెంటు రూజ్వెల్టుగారి వచనములలో ప్రజలేప్రభువులను సిద్ధాంతము నంగీకరించు అభిప్రాయములకు సవాలు చేయబడుచున్నపుడు, నేను, సంపూర్ణవినయముతో, ప్రభుత్వదృష్టిలోనున్న 'ఉద్దేశ్యము; అనగా సాధ్యమైనంతవరకు ప్రజలను రాష్ట్ర పరిపాలనలో చేర్చుట, విజయమునందుటకు, మొదటి అవసరము వాక్స్వాతంత్ర్య, పత్రికా స్వాతంత్ర్యములు, ఇప్పుడు కలపెట్టబడిన పత్రికాశాసనములో ఈరెంటికిని కొంతవరకు అవకాశమీయబడగలదనియు, కాంగ్రెసు ప్రభుత్వములు చూపిన ఉదారమార్గ మవలంబించబడునవియు, నేరములను శిక్షించుటకు సాధారణ శాసనములు మాత్రమే ఉపయోగించబడునవియు నేను నమ్ముచున్నాను.

## వనపర్తి

ఆంధ్రకవి యకాల మరణము

౧౦ అశ్వ

శ్రీకృష్ణగంటుల లక్ష్మణశాస్త్రి శిరోమణిగారి మరణము తెలుపుచున్నారు.

వనపర్తి గ్రామవాస్తవ్యులు మాప్రియమిత్రులునగు ఆస్థాన కవులు, నవటి యున్నత పాఠశాల ప్రధానాంధ్రా ధ్యాపకులు నగు శ్రీమాన్ విద్వాన్ ఓక్రాల నరసింహాచార్యులవారు ౪-౫ దినములు జ్వరముచే బాధపడి యకస్మాత్తుగా ఈ అశ్వ - ౧౩౪౭ ఫ. న స్థాపించి స్వర్గసుఖమును అలరగొనుటకై అ విషాదకరము. వీ రాంధ్రగీర్వాణ సాహిత్యములయందు దసమాన పాండిత్యముపడసి యుండు యాభాషలకవితా విశారదులై జీవించిన ౩౫ సంవత్సరములలోనే మన నైజాం రాష్ట్రమునకే కాక యితరరాజ్యములయందు కూడా పేరుపెద్దలంగీర్తి కాముదిరిరి. ఒకవనపర్తికేగాక నిజాంరాష్ట్రాంధ్ర ప్రాంతీయులకెల్లరకు విట్టి యానర్ఘకవితిలకము గోల్పోవుట మిక్కిలి నష్టము. వీరియాత్మకు భగవానుడు శాంతియొసగును గాక. వీరికుటుంబమునకు చిత్తశాంతిం బ్రసాదించుగాక.

## ప్రకటన

తెలంగానా జిల్లాల అన్నిటియందును నెలజీతములపై పనిచేయుటకు, తెలుగు భాష యందు వాక్పటుత్వము, మంచి పలుకుబడి గల యువకులు కావలెను. దరఖాస్తులు యీనెల 30. తేదిలోపల దిగువ అడ్రసుకు పంపవలెను.

Apply to: శెక్రటరి.

సర్వ సహాయ సంఘము

చంద్రా వెంకన్న బంగళా, గాస్మండి

సికింద్రాబాదు.దక్కన్

## అలంపూరు, గద్వాల సీమలలో క్షామతాండవము

[నాకొక బంధువు వ్రాసిన జాబులోని కొన్ని విషయములను నిందు ప్రకటించుచున్నాను. ఆజాబు పత్రికలో ప్రకటనార్థమై పంపబడలేదు. ఇతర స్వకీయవిషయాలతో పాటు ఈచర్చను చేసినాడు. ఈవిషయములు ప్రజా సంబంధమైనవి కాన ప్రకటించుచున్నాను

సం. ప్ర.]

"విష్ణుపను. . . . గారి సమ్ముఖమునకు ఉ॥కు॥ . . .

నేను సన్నిధినుండి నిజామాబాదునకు వెళ్లి అక్కడ నాలుగురోజులు నిలిచి వెళ్లినస్తిని. అక్కడకొంత సుభిక్షముగానున్నది. ఇక్కడ మనగ్రామము. (అలంపూరు తాలూకాలోని ఇటిక్యాలపాడు గ్రామము) వచ్చియాతసరికి గుండెలు నీరాయెను. వర్షాలు బొత్తిగా లేవు. కొర్ర చేను ఎండి గాలికి పోవుచున్నవి వేలుపెనగ లవాడి దగ్గరికి దీపం ప్రమిదల మాదిరియై ప్రాణ పోలేక నల్లగా బోసులమాదిరి ఆయినవి. ఇటువంటి కాలము ఎన్నడును చూడబోము. కాలము నమ్మికలోనే మాయమయ్యెను. ఈ దినమువఱకుకూడా వర్షము కురియలేదు. ఐదు రోజులనుండి కొండుకట్టడము విడిచిపెట్టినారు ఇంకా బీదలలోకలస్థితి చెప్పతరముకాదు. పట్టపగలు యిండ్లలోదూరి జొన్నలు పోసుక పోవుచున్నారు. ఒండ్ల రాకపోకలు నిలిచినవి. చిల్లరలోకలు ఇండ్లముందరపడి "గింజలిస్తారా ఏమ టారు" అని మొండికి పడుచున్నారు అల్లరిచేయుటకు ప్రారంభము చేయుచున్నారు. కర్నూలునుండి (ద్రిటిషుఇలాకా) ధాన్యము తెచ్చుకుంటే కరోడ్గిరిభారము తగులునని కర్నూలునుండి ధాన్యమువచ్చుట తక్కువైనది. ఇక్కడధాన్యము దొరకుటలేదు. తిండికిలేక బాటల వెంట పోవువాండ్ల సద్దులు లాగుకొని కొట్టబట్టినారు ప్రక్క గ్రామములవారు ఇంకొక గ్రామమునకు తిండి ధాన్యములకొఱకై వెళ్లుచున్నారు చుట్టుప్రక్కల దొంగతనములు జరుగుచున్నవి ప్రయాణముచేయుటయే కష్టమైనది. నిన్నటిదినము బోరవెల్లిలో (గద్వాల సంస్థాన గ్రామము) కోమటి రామచంద్రయ్య యింటిలోపల పగలు రెండుపల్లాల బియ్యం తీసుకపోయినారు. అమరవాయినుండి ధర్మవరమునకు (ఈరెండును గద్వాలగ్రామములు) కల్లు బండి పోతూవుండగా ౨౦-౩౦ మంది బండిపైబడి కల్లు ఒకసాట్టుకూడా లేకుండాత్రాగి బండివాని బట్టలుకూడ విడిపించుకొనపోతే వాడు "మీబట్టలు నాకిచ్చి నాబట్టలు మీరు తీసుకపొండి" అనిచెప్పగా దయదలచి పోయినారు.

మఱి ఇంకొకవార్త! "వానదేవా" అని దెలగ ఆడవాండ్లు కొకరయ్యను గంపలోపెట్టుకొని బిచ్చమెత్తుకొని బోరవెల్లినుండి ధర్మవరము పోవుచుండగా ఈమధ్య వాండ్లగంపలో వున్న జొన్నలు తీసుకొని వాడ్లబట్టలు—చీర సనేకము—విప్పుకొని తీసుకొని, ఉత్తబత్తల చేసి పంపినారు ఈ ఉత్తరకార్తె వెళ్ళేవరకు వర్షము లేకపోతే ఒకరిని ఒకరు ఆకించరు. ఇంత భయోత్పాతము పుట్టినది

గద్వాలలో నాలుగురోజులక్రిందట చిల్లరలోకలు ఎలుకూరు గ్రామమువాండ్లు అమ్మగారి (శ్రీ మహారాణిగారి) తావుకపోయి కూటికొత్తము ఇప్పించమని అడిగినారట! అమ్మగారు అంగడికి నాలుగుసేర్లబియ్యము బత్తెమునవాలు చేసి యిప్పించగా ఒకపూట వండుకొని తిన్నారట మళ్లీఅడుగగా దుకాణముదారుల తావుకపొమ్మనగా దుకాణములు బందుచేసి నారను సంగతి వింటిమి . . . .

గద్వాల సంస్థానములో అల్లరులు అయ్యే ఆట్లున్నది దాన్నిచూచి మన తాలూకాలో కూడ జరిగేటట్లు వున్నది

మహబూబునగరు జిల్లారైతుల భూనమూచిన మరీ కష్టమున్నది కేరూరు (కురుమూర్తి స్వామివద్ద గ్రామము) పోయిమాస్తిని పుబాసజొన్నలు ఎండిపోయివున్నవి బుడ్లలు (వేరు సెనగలు) ఎండిపోవుచున్నవి పశువులకు మేతలేక కన్నకష్టములు పడుచున్నారు! పలికలు, గంపలు తీసుకొనిపోయి ఎక్కడెక్కడనో వున్న ఆకులలములు, గడ్డిగంటలు దోసుకొని తెచ్చి రాత్రికి వాటిముందర తెచ్చివేస్తే ఆవికడుపులో యేమీ అపరలేక అట్లనే కండ్లుమూసుక నగముకడుపుక తిని సొలుసులాడుతూ వుంటవి, వాటిఘోషచూసే యేడుపువస్తూవున్నది ఏమి చేయవలెనో కొందామంటే మేతదొరకవు మొలకసీమ (మహబూబునగరుజిల్లా) అంతయు అంతేఐంది. పరమేశ్వరునికి అక్కడ రావలసినదే గాని ఏమియు చెప్పలేలులేదు. మనప్రాంతములోకూడ చాలమందికి పశువుల మేత విపోయినవి కొంతమంది చాల అవస్థలు పడుచున్నారు

ముందు వర్షములు పడినను విత్తనములకుకూడ జొన్నలు దొరుకకుండ వున్నవి. మనగ్రామములో ఏరైతుయింటకూడ ఐదుపల్లాల జొన్నలైనా లేవు చిల్లరలోకలు ఇండ్లమీదికివస్తే భయముకలిగి వారికిపీడోపని కల్పించి, దినానికి ఒకటిన్నరసేరు జొన్నలు ఇస్తూవున్నాము పల్లెఅధికారులు సర్కారువారు ఏమియు విచారణచేయుటలేదు. ఈసమయములో సర్కారు బీదలకొఱకు పనులుకల్పించిన బాగుండును. ఈశ్వర భాద్రపద శు॥ ౧౪లు.

ఇట్లు

. . . . . . . . .

## పోలీస్ నోటీస్

మోటారుబండ్ల యజమానుల ఎరకకు హైదరాబాదు స్టేటు మోటారుబండ్ల చట్టము ప్రకారము 30 ఆబాన్ 1346 ఫసలీ (అనగా 6అక్టోబరు 1937)తో ప్రస్తుతమున్న రెజిస్ట్రేషన్ పూర్తియగును.

అందుపైన 15 దినములు ముజరాగా 1వ ఆజూర్ 1347 ఫసలీనుండి (అనగా 6అక్టోబరు 1937 నుండి) మోటారు యజమానులకు 1347 ఫసలీ రెజిస్ట్రేషన్ చేయించు కొనుటకై యివ్వబడును

15వ ఆజూర్, 1347 ఫసలీ (20అక్టోబరు 1937) తరువాత రెజిస్ట్రేషన్ కానటువంటి మోటారు బండ్లను వాడుకలో నుంచు వారు రూల్సుయొక్క 11వ శర్త్ ప్రకారము ప్రాసిక్యూషన్ చేయబడుదురు





## గద్వాల

### క్షామము

(స్వకీయ విలేఖరి)

౧౩ ఆబాన్—

రెండుమాసములనుండియు వర్షములుబొత్తిగా లేకపోయినవి ఎన్నిపూజలుచేసినను వర్షాధిపతికి దయకలుగక పోయెను, అనేక గ్రామములలోని మొలకలన్నియు ఎండిపోయినవి, మెరగా జనులకు తిండికికూడు లేకపోవుటచేత చాలమంది ఆకలిచేత మాడిపోవుచున్నారు. గతవారము ఎలుకూరు గ్రామప్రజలు సుమారు ౫-౬ వందలకలిసి గద్వాలకుపోయి తమకు తిండికైన యిప్పించిన బ్రతుకుదుము లేకున్న నాశనమగుదుమని మొరపెట్టుకొనగా దయామయులైన శ్రీమంతు మహారాణీగారు ౫౦౦౦ రూపాయిల తకావి ఇచ్చినారని విను చున్నాము

ఉత్తరకార్తె దాటిపోవుచున్నను వర్షమురాకపోయెను. "ఉత్తరచూచి ఎత్తరగంప" అను సామెతకు సిద్ధించుచున్నట్లు కనబడుచున్నది.

## పోచన్నపేట

### నేటివరకు వర్షములేదు

(ఒక విలేఖరి)

౧౪ ఆబాన్ క॥:—

ఈగ్రామము ఆత్రాఫ్‌బల్దా జిల్లాలోచేరినది. ఆలెరు స్టేషనుకు ౨ మైళ్లదూరమున సిద్ధిపేటకుపోవురోడ్డు సమీపమునగలదు. ఇది సుమారు ౩౫౦౦ జనాభాగల కస్బాగ్రామము. ఒక టప్పాఖానా సర్కారు పోలీసుఠాణాకలదు. సర్కారువారి రికార్డులలో "షా ఆలమ్ ఆబాద్" అని యీవూరికి నామాంతరము.

#### కాలమానము—క్షామసూచనలు

ఇప్పుట శ్రావణమాసమంతయు వర్షములేదు. భాద్రపద మాసములో నేటివరకు వర్షములేదు. భూవర్షములుగాని, ఖండవృష్టులుగాని లేవు. ఎండవేడిమి హెచ్చుగానున్నది పశువులకు గడ్డి దొరకక అల్లాడుచున్నవి ఇదివరకు యీశ్వర వత్సరారంభమున పడిన పెద్దవర్షమునకు యీ పూరిచెరువులోనికి నీరువచ్చినది. అనీరుచూచి రైతులందరు తల్లులిరి. ఇప్పుడు నీరుతగ్గిపోవుచున్నది వర్షములులేవు ఇదివరకు నవవస్త్ర వృష్టిలో అభివృద్ధిగాంచిన పైరులు యిప్పుడు తగినంతనీరులేక యెండి సగముగ మాడిపోవుచున్నవి. రైతులలో కొందరు తమపశువులను ఇతరదేశములకు అనగా "ఖరకు" కొట్టుచున్నారు. ఇదివరకే ఋణముచేత్రుంగి కృశించుచున్న రైతు యీక్షామబాధచే యేటుల జీవయాత్ర గడపునో! వాని వ్యాధయు యెటుల తొలగించుచున్నదో తెలుసుకొనుట కష్టము. పునాసపైరులగు జొన్న, కంది, సజ్జలచేలు వర్షాభావముచే మాడిపోవుచున్నవి. వీటినిజూచి రైతుల వదనము నిస్తేజమైపోవుచున్నది. వర్షములు విరాటపర్వము పురాణము చెప్పి అన్నదాన మొనర్చినను వరుణదేవతకు జాలి కలుగలేదు.

#### పత్రికా పఠనాలయము

ఇచ్చట సుమారు ౧౫ మంది చందాదారులచే పత్రికా పఠనాలయము స్థాపింపబడినది. ప్రస్తుతము గోలకొండ ఆంధ్ర దినవారపత్రిక లవచ్చుచున్నవి.

